# మంగళగిరి నృసింహస్తవము.



ఇది

న్యాయాధిపతి మ్యాన రామశాస్త్రిచే రచియింపబడి

సరస్వతీ ఎడ్యుకేషనల్ ప్రెస్, నందు ముద్రింపబడియె

1913. సం॥ బెజవాడ [వెల 0-0-6



శ్రీ హయగ్రీవాయ నమః.

# మంగళగిరినృసింహస్తవము.

శా॥ శ్రీమన్మంగళభూభృదగ్రనివసత్సింహాసనాసీన భ
క్తస్తోమాభ్యర్థసరోజభాస్వరఘృణీ తాపత్రయీంహీవ్యథా
శ్రీమాంత్యంతిపిపాటనాచరణమణే వేదాగ్రసంస్తుత్య దే
వా! నారాయణ! కృపాబ్ధే! మంగళగిరిస్వామీ నృసింహప్రభో.

మ॥ చదువన్గాఢ్యమునైన, శా స్త్రములనన్నా దేహమే, భ క్తియా
గొనకావే జూడఁగ విత్తభోగ కీర్తుల్ గ్రొత్తే, బలాత్కారమే
సదయా? యేదెట్టులైన నిస్సరణమే సర్వేప్సితప్రాప్తి సం
పద లభ్యంబగుగాద? మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

మ॥ ధనమేనార్జనసేయ వ్రాసితి యథార్థంబైన సద్భక్తిచే
వినుతుల్ సేయఁగ వ్రాయనైన వగనో? భీతిల్లియో? నీమవే
రున శోధించెను వానిమీఁదఁ దగుకారుణ్యంబు జూపింపగా
జను నీకీర్తికి వన్నె మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

శా॥ దేవా దుష్టుఁడనాఁడు శతృలడిరన్ దీనావనా గాచిన్
నీవేదిక్కిఁక వేరులేరుజగతిన్ నిన్నే సదానమ్మితిన్
నీవాడన్ ననుగావరమ్మికనుదంౘ్రీ? తప్పదెల్లైన నో
భావాతీత సురూప మంగళగిరిస్వామీ నృసింహప్రభూ:

మ॥ దినముల్ బాట్టుకుగా ధనాశజనులన్ దీవించుచున్వ్యర్థమై
చనగాఁ గాలముఁ బాడుఁజేసితినెటో జన్మాంతరమ్మందు చే
సినపుణ్యంబున వాకుభక్తివాఁడమెన్ శ్రీవల్లభాయెట్లుగా
ననుయత్నించెదా దేవ మంగళగిరిస్వామీనృసింహప్రభూ.

శా॥ అయ్యా దాతవు నీవు యాచకుఁడ సుమ్మా నేను ముమ్మాటికిన్
చెయ్యాచాచను నీకుదప్ప పరులన్ సేవించఁగా నెంచ, నా
కుయ్యాలింపుము దానకాలము సుమా కోపంబు చాలించుమా
సయ్యాటల్వ్యాలదింక మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

శా॥ స్వామీ! మామక పాపసంచయములన్ వ్రాయంగ పత్రంబులే
భూమిఙ్జిక్కక పోయె, గంటములహో హా, మొక్కారె చిత్రాదులే
కామాటంబున నన్యజీవగుణ లేఖాకార్యముల్మాని దే
వా! మాతండ్రిక గాచు మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

మ॥ వరసంధోహముగోరి రత్నరతులన్యాసిల్లుభూషాళి నీ
కరణంబీయఁగశక్తిలేదు సదయా? యార్తార్తి నిర్వాపణా
వరముల్వాందలు వేలుఁగోర నొకటే వాంఛింతు నీనామ సం
స్మరణంబిమ్మికనాకు మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

మ॥ పతితున్పావను జేయఁ గంకణము దేవా? గట్టినావెప్పుడే
పతితుం డుద్భవమందునో యతని నావస్థిలో? లేదో దయా
మతి యోజింపక పాపరూపుడను దుర్మార్గుండ నేపుట్టితే
పతుకత్వంబుఁగాతు మంగళగిరిస్వామీ నృ॥

మ॥ సిరియాళక్కు వసీకు పెంపుమెకదా శ్రీవల్లభా సంపదే
కళవా సృష్టికానర్పుపుత్రుఁడుకదా, గంగామహాదేవి నీ
చరణాబ్జంబున జన్మమందెనుకదా, సర్వాత్మ సన్మోహివఁగా
బరువా? యొక్కని నీకు మంగళగిరిస్వామీ నృ॥
మ॥ కొడుకా చెప్పినమాటలిప్పుడెవిన న్గోపించు పెండ్లామనన్
పెడితేలించికిమొందు లేనియడల స్వేతన్లుగా బంధుగుల్
ముదువుల్లైకొనవత్తు రందరివృథా పోషింప మోహాబ్ధిలో
పడుచున్నిట్టు స్మరింప మంగళగిరిస్వామీ నృ॥

మ॥ తలక్రిందై చదువంగ శాస్త్రములలో తత్వంబెదో యబ్బునా
కలుగంగావలె భక్తి కొంచెమయినన్ గారుణ్యరత్నాకరా
మెలగంగావలె సీదుభక్తతతితో మేలైన నామావళు
ల్పలుకంగావలెనోట మంగళగిరిస్వామీ నృ॥

మ॥ చదువన్వేదముశాస్త్రిమేమిఫలమో, స్వామీయధార్థంబు
గా। మదిలో శొద్దియొనొప్పొభక్తిశలదా మానాధ నీపైననే
ప్రేమదమ్మున్ జొచ్చిన కేదెంబ్బు బురదే రాజీవసౌగంధ్యగం
పదవాసించఁగజాని మంగళగిరిస్వామీ నృ॥

మ॥ మనమందించుకభక్తి లేక, జగతిన్మర్యాదకో? పేరుకో?
తనభూపాలుడుమెచ్చి రావుబహాదూర్దిచ్చునో యంచు చే
సిన, దానాలును ధర్మముల్ తుదకునీచిత్తంబు రంజింపఁగా
జనుదా, వ్యర్థముకాద? మంగళగిరిస్వామీ నృ॥

మ॥ క్షితిపైఁగొందరు జీవనంబుకొఱకే, శ్రీరామ శ్రీరామ యం
చతిభక్తింగలమానిపుంగవులనా? వ్యామోహ మొందింపలో
కతతిన్ జీవితకాలమిట్లు కపటాకారంబున న్వచ్చునా
పతితుంజేగతికేగు మంగళగిరిస్వామీ నృ॥

మ॥ తొలిజన్మంబునఁ జేయు పుణ్యమున నేదో గొప్పయుద్యోగమై
వెలయన్, గన్నులు నెత్తికెక్క, జనుల న్వేధించుచు ర్మార్గుఁడై
యిల బాయన్ యముఁ డేయు శిక్షులకుఁ, గానేదిక్కు లేకున్న, వే
పలవింపంగ, ఫలం బదే? మంగళగిరిస్వామీ నృ ॥

మ॥ పిలువం బల్కవదేమి కారణము, రూపింపంగ లేనైన నీ
కలిమాహాత్మ్యము? గర్వమో? బిగువో? భక్తవ్రాతసంరక్షణం
బులు, మా, నదలపెట్టినావో? పలుకే ముత్యాలమూటయౌనో
చలమో? దీనునిలోడ మంగళగిరిస్వామీ నృ ॥

మ॥ ధనవంతుల్తన కేమియిత్వితలకె త్తంజూతురో వారు వే
చను(తో వల్లనిపెట్టి చిత్తమనుచున్ శ్లాఘించ, వేసారదీ
మనసే మోహితమైన నిన్ను దలఁచన్నాల్గుర్ణ యెట్లో త్రిప్పఁగా
జను నీసేవనొనర్ప మంగళగిరిస్వామీ నృ॥

మ॥ గిరినీపైబడవైచి త్రిప్పూటకుగా కృష్ణా? ప్రయత్నింప న
ధ్వరముగ్గాఁచగనాఁడుదాని నట చంపన్నిన్ను ప్రేరేచనో
హరివారధ్యము దోలుమంచనను, నాయందేమి తప్పున్నదో
శరణార్థిన్ ననుగావు మంగళగిరిస్వామీ నృ॥

మ॥ బ్రతుకన్నాళ్లమొకొద్ది యందుజనునిద్రాశక్తి సర్ధంబు వే
గతియించున్మఱి బాల్యయౌవనములన్గామాదులన్వ్యర్ధమై
వ్రతమా? తీర్థమ? దానమా? జపమ? నిన్బ్రార్థింపనా? జన్మమే
ప్రతిభన్సార్థకమౌను మంగళగిరిస్వామీ నృ॥

మ॥ పగలేమాయయొ మర్మమోసలిపి సంపాదింపఁగా రాత్రులే
తగులాటంబునో నిద్రనోగడచుగా ధన్యాత్మనీసేవకై
పగలున్రాత్రియు తీరదేమియును దేవా యెట్లుగాపాడెదో
భగవంతాకరుణించు మంగళగిరిస్వామీ నృ॥

మ॥ తనువేవేళనసించునోయపుడు సిధ్యానంబు ప్రాప్తించునా
వినుమేనిప్పుడె సంస్మరింతు నెటులో, విశ్వాత్మ? దీనావనా?
నినెనా నమ్మితి నమ్మినానుగద తండ్రీ? యెల్లగాపాడి యీ
జనిసార్థక్యముచేయు మంగళగిరిస్వామీ నృ॥

మ॥ కలదా? దీనులఁ బ్రోచుకంకణము కల్గన్వేళకాలేదె; రా
వలదా? చెప్పగరాద? చేతగునా, పాలించు [illegible]డనా
వలనద్దప్పులుకల్గ బిడ్డడనుచున్ భావింపగారాద హే
చలమా బ్రోచుటకింత మంగళగిరిస్వామీ నృ॥

మ॥ క్షితిపై నెవ్వరి నమ్మ నన్యా విను లక్ష్మీనాథ నీపాదమే
గతిగా నమ్మితి నాకు వ్రాతయెటుగా గానున్నదో తండ్రి నీ
మతి కెక్కన్ గరుణించు లేనియెడల న్మన్నించువా రుండిరే
పతమా? యన్యులప్రాపు మంగళగిరిస్వామీ నృ॥

శా॥ నీకున్మంగళమో కృపాజలనిధీ నీకాంతకున్మంగళం
బో కంసాదిమదాంధదానవహరా, యోదేవదేవా హరీ
నీకారుణ్యమె గోరి మంగళమిదో, నీకీర్తులై కొమ్మ నర్క
సాకంగా జనుదెమ్ము మంగళగిరిస్వామీ నృసింహప్రభూ

శా॥ నీకున్మంగళమౌ కృపాజలనిధీ నీకాంతకున్మంగళం
శ్రీ కంసాదిమదాంధదానవహరా, శ్రీమాదేవ " హరీ
నీకారుణ్య మగోరి మంగళము నే, నీకిత్తు గైకొమ్ము వా
పాకంగా సుదేమ్ము మంగళగిరిస్వామీ నృసింహప్రభూ.

మంగళగిరి నృసింహ స్తవము

సంపూర్ణము.

